## మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 10.

బంగారు-వెండి వేలమధ్యాహ్నం 1 గంటకు వరకను 1-కి ఎడ్వర్టైజొమ్ము పేర్చుటాక్పురోవకా రు 78.6.0 పెట్టుబంగారు తులం 113.8.0 మూన బంగారు 111.0.0 పీసువెండి తులం 100 క (కెడ) 191.0.0 వెండి తులం 1-కి 200.

వేరుశనగ : (531 పా 1-కి ఎక్సుకోఫ్త్రా గిడ్డంగుల మెషిన్ - పేర్చుటాక్పురో వకా)
కడిలి రు. 182 నా.
వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ ఐల్ 3%
జామినర్ (500 పా.) రు. 350 నా.
కొబ్బరి నూనె (37½ వీసులు గల డబ్బా)
ఒకటి-
క్రైరాక రు. 39-12-9
జాంబిక్ మన్. బ్రాండ్ 39-14-9

ఆముదం
500 వీసులు గల బారువ ఒకటికి
"ఆదువత్తూర్" రు. 420-0-0
"కరసాంబాష్వపేం" రు. 430-0-0

## WANTED



## ప్రకటన



## కావలెను



## స్థిరాస్తి వేలము



## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద శు॥ ఏకాదశి
1951 సం॥ సెప్టెంబరు 11 మంగళవారం
మం॥ ఏకాదశి రా 8-13 పూషా ప 9-46 వర్జ్యం పా 5-10 ల 6-38 కు.
బు॥ ద్వాదశి సెప్టెంబరు 12 బుధవారం
బు॥ ద్వాదశి రా 12-40 ఉషా ప 7-57 వర్జ్యం ప 11-39 ల 1-8 కు.

# ఆంధ్రపత్రిక

ఒరుతేయని యొనరించిన నరునిం, యప్రియము దన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద శు॥ ఏకాదశి
మంగళవారం

## కాంగ్రెస్

అఖిలభారత కాంగ్రెస్ సంఘం బాబు పురుషోత్తమదాస్ టాండన్ రాజీనామాను అంగీకరించి, పండిట్ జవహర్లాల్ నెహ్రూను అధ్యక్షుడుగా ఎన్నుకుంది. కాంగ్రెస్ అధిష్ఠానవర్గం నుంచి వైదొలగడానికి పండిట్ నెహ్రూ తీర్మానించుకున్న తరువాత అధ్యక్షపదవికి రాజీనామా ఇవ్వడం కంటె బాబు పురుషోత్తమదాస్ చేయకల్గింది ఏమీ లేదు. ఆ పదవిని తాను స్వీకరింపక పండిట్ నెహ్రూ చేయకల్గింది వేరే ఏమీ లేదు. ఈ మార్పుకు తన ఆమోదాన్ని ప్రకటించడానికి మించి అఖిల భారత కాంగ్రెస్‌సంఘం చేయ కల్గిందికూడా ఏమీ లేదు. ఈ విధంగా అందరూ పరిస్థితులకు లొంగిపోయినారు. అయితే ఇందువల్ల పరిష్కారమైన అసలు సమస్య ఏమిటో వెల్లడి కాలేదు. పండిట్ నెహ్రూ కార్యవర్గ పునర్నిర్మాణంద్వారా ఆశించింది ఏమిటి? ఆయనకు కాంగ్రెస్ అధ్యక్షపదవినికూడా అప్పగింతపెట్టి అఖిలభారత కాంగ్రెస్ సంఘం పండిట్ నెహ్రూ కోర్కెలను ఎంతవరకు ఈడేర్చింది? ఈ ప్రశ్నలకు సమాధానాలు కాలగర్భంలో నుంచి ముందెప్పుడో బయటపడాలి.

కాంగ్రెస్ చరిత్రలో ఈ సంఘటన చాలా అపూర్వమైంది. కాంగ్రెస్ సంస్థపై కాంగ్రెస్ ప్రభుత్వాలకు సర్వాధికారం ఉండరాదనే సూత్రం ప్రధానమంత్రే కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నిక కావడంతో కాంగ్రెస్ నిబంధనావళినుంచితొలగిపోయింది. పండిట్ నెహ్రూ తన కార్యవర్గాన్ని ఏర్పాటు చేసుకోవడంలో ఒకవేళ వెనుకటిమాదిరే 19 మందిలోనూ అర్హులైనే ప్రభుత్వస్థానాలను ఆక్రమించిన కాంగ్రెస్ వాదులనుంచి ఎన్నుకున్నప్పటికీ, అది కేవలం సంప్రదాయాన్ని అనుసరించినట్లే అవుతుందిగాని, ఒక నిర్దిష్ట సూత్రాన్ని పాటించినట్లు కాదు.

ఈ ప్రకారంగానే రాష్ట్రాల్లోనూ కాంగ్రెస్ సంఘాలు, కాంగ్రెస్ ప్రభుత్వాలు పునర్నిర్మాణం కావాలి అంటే భారత దేశంలోని నేటి రాష్ట్రాలన్నీ భాషాప్రయుక్తంగా పునర్నిర్మాణంఅయితేనాని సాధ్యంకాదు. చెన్న రాజధానిలోనూ, మధ్యప్రదేశ్ లోనూ, బొంబాయిలోనూ ఒకటికంటే ఎక్కువగా రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలున్నాయి. రాష్ట్ర ప్రధానమంత్రే రాష్ట్ర కాంగ్రెస్ సంఘ అధ్యక్షులు కావడం అన్నది ఆచరణసాధ్యంగాని వ్యవహారం.

కాంగ్రెస్‌లో ఈ రోజున అసాధారణ పరిస్థితులు ఏర్పడిన వనీ, వాట్ని తొలగించి కాంగ్రెస్ మహాసంస్థను పునరుజ్జీవింప చేయడానికి ప్రధాన మంత్రిగాగాక, వ్యక్తిగానే, పండిట్ నెహ్రూ అధ్యక్షపదవిని స్వీకరించాలి అని అంటే ఇప్పటి ఏర్పాటు ముందుకు ఒక సంప్రదాయంగా ఏర్పడదు. కాని ఈ నెల రోజులుగా నెహ్రూ-టాండన్ వివాదాలపై ప్రముఖులు వెల్లడించిన అభిప్రాయాలను గమనిస్తే అసలు విషయం 'కాంగ్రెస్ మరమ్మతు' కాదని స్ఫురిస్తుంది. అదేసమస్య ఐతే ప్రధానమంత్రే కాంగ్రెసు అధ్యక్షుడు కూడా కావడంతో, ఆ ఏర్పాట్నే రాష్ట్రాలకూ వర్తింపచేయడంతో సులభంగా, స్థిరంగా పరిష్కారమైపోయిందనే చెప్పవచ్చు. కాంగ్రెస్ సంఘాలకూ, కాంగ్రెస్ ప్రభుత్వాలకూ ఏవిధమైన సంబంధాలు ఉండాలి అన్నది ప్రస్తుత వివాదాంశం కాదని పండిట్ నెహ్రూ స్పష్టంగా ప్రకటించారు. అయినా ఈవివాదంలో ఇదే ప్రధాన స్థానాన్ని ఆక్రమించింది. ఇందువల్ల కాంగ్రెస్‌లోనూ, కాంగ్రెస్‌వాదుల్లోనూ ఉన్న లోపాలను గురించిగానీ, వాట్ని ఎలా సరిదిద్దాలనే విషయాలనుగురించిగానీ ఎవ్వరూ, ఆఖరికి అఖిలభారత కాంగ్రెసు సంఘంకూడా, విచారించినట్లు కన్పించదు.

ఒక్క పండిట్ నెహ్రూకు మాత్రమే ఈ విషయంలో ఖచ్చితమైన అభిప్రాయం ఉన్నట్లు అఖిలభారత కాంగ్రెస్ సంఘం శనివారంనాటి సమావేశంలో వారుచేసిన ప్రసంగం వల్ల స్పష్టంగా తేలుతున్నది. "ఈ ప్రధాన మంత్రిపదవిని వదలిపెట్టి, కాంగ్రెస్‌కే నా సర్వశక్తులూ ధారపోద్దామని నా మనస్సులో ఒక మూల ఈ రెండు సంవత్సరాలబట్టీ అనిపిస్తూనే వుంది." అని పండిట్ నెహ్రూ కాంగ్రెస్ సంఘాల గమనంవల్ల తాను ఎంత ఆందోళన చెందుతూ ఉన్నదీ విస్పష్టంగా వెల్లడించారు. అయితే ఆయనే కాంగ్రెస్ అధ్యక్షతనుకూడా స్వీకరించాలని కోరినవారు ఈవిషయాన్ని ఎంతవరకు గ్రహించారన్నది ఇంతవరకూ వెల్లడికాలేదు.

కాంగ్రెస్ వాస్తవంగానే ప్రజలకు దూరమైంది. కాంగ్రెస్ వాగ్దానాల్లో, కాంగ్రెస్ నాయకుల ప్రకటనలలో ప్రజాసామాన్యానికి విశ్వాసంతగ్గింది. అందుకు కారణం కాంగ్రెస్ నాయకుల, కాంగ్రెస్ వాదుల ప్రవర్తన, కాంగ్రెస్ సంఘాల వ్యవహార పద్ధతి, అన్నింట్నీ మించి కాంగ్రెస్ ప్రభుత్వాల విధానము, పరిపాలనాధోరణి, పద్ధతి, ముఖ్య కారణాలు. దాదాపు మూడేళ్లక్రితం జయపూరు కాంగ్రెస్ మహాసభ కాంగ్రెస్ వాదులు ఏ విధంగా నడుచుకోవాలో సూచించింది. త్రికరణ శుద్ధిగా నిర్మాణం చేయడం వరకే తమ బాధ్యత అని కాంగ్రెస్‌వాదులు భావించారు.

ఇకముందైనా ఇలాంటివి జరుగరాదని నెహ్రూ పట్టుదల. అదును గాఢ వాంఛ. ఈ ఆశయాన్ని సాధించడానికి వారు అధిష్ఠానవర్గంనుండి వైదొలగదానికి నిశ్చయించుకున్నారు. తినే స్వయంగా నాయకత్వం వహించితేరప్ప తన ఆశయం సిద్ధించే అవకాశం లేదని భావించి కాంగ్రెస్ అధ్యక్షపదవిని స్వీకరించారు.

కాంగ్రెస్‌ను పునరుజ్జీవింప చేయడానికి ఇది ఒక్కటే చాలదని పండిట్ నెహ్రూ అఖిల భారత కాంగ్రెస్ సంఘం రెండవనాటి సమావేశంలో చేసిన సుదీర్ఘప్రసంగం హెచ్చరిస్తున్నది. కాంగ్రెస్‌లో ఉన్న వారందరూ ఏక మనస్కులై, ఒకేవిధంగా వ్యవహరించాలనీ అలా చేయలేనివారికి కాంగ్రెస్‌లో స్థానం లేదని కాంగ్రెస్ నూతన అధ్యక్షుడు ప్రకటించారు. ఎన్నికల్లో జయాపజయాలతో నిమిత్తం లేకుండా ఋజువర్తనులైనవారినే కాంగ్రెస్ తన అభ్యర్థులుగా ఎన్నుకోవాలన్నారు. అలాంటివారు కాంగ్రెస్‌లోగాక విడిగాఉన్నవారైనాసరే వారినే కాంగ్రెస్ తన అభ్యర్థులుగా నిలబెట్టాలని సూచించారు.

కేవలం ఒక రాజకీయ పక్షంగా కాంగ్రెస్ మహాసంస్థ పరిణమించింది. తిరిగి భారత జాతీయ సంస్థగా చేయాలని పండిట్ నెహ్రూ సంకల్పమైనట్లు ఇందువల్ల వెల్లడి అవుతున్నది. అంటే దేశంలోవున్న సమర్థులు, ఋజువర్తనులు అయిన వారందర్నీ కాంగ్రెస్‌లో చేర్చి, వారితో ప్రభుత్వాన్ని ఏర్పరిస్తే మనకు ఏకపక్ష ప్రభుత్వమే స్థిరమౌతుంది. ప్రజాస్వామికం వర్ధిల్లడానికి ఇదిఅంతగా దోహదం చేయదని రాజ్యాంగ శాస్త్ర ప్రవీణుల అభిప్రాయం. ఆ అభిప్రాయంతో ఏకీభవింపక పోయినా సమర్థులైన ఘరానా వ్యక్తులసందర్నీ కాంగ్రెస్‌లోకి తీసుకోవడం వాంఛనీయమే అయినా, ఆచరణలో అది ఎంతవరకు సాధ్యము అన్నది పండిట్ నెహ్రూ కృషిఫలితాలు వెల్లడి అయితేగాని తెలియదు.

తనకు తోచినవిధంగా కాంగ్రెసును సంస్కరించడానికి పండిట్ నెహ్రూకు బాబు పురుషోత్తమదాస్ టాండన్ తన రాజీనామాద్వారా సంపూర్ణావకాశం ఇచ్చారు. వారు తిరిగి పండిట్ నెహ్రూ ఏర్పాటుచేసే కార్యవర్గంలో ఉంటం సంభవించదు. వారి 'వర్గం'వారు నెహ్రూవిధానానికి ఎట్టి అవరోధాలూ కల్పించరనే పండిట్ మిశ్రా కాంగ్రెసునుంచే వైదొలగడం ద్వారా ఋజువైంది. పండిట్ నెహ్రూ అధ్వర్యం వహించడం ద్వారా కాంగ్రెసుకు నూతనోత్తేజం కల్గితే ఆ పనిని ఇదివరకే ఇంత రభస జరక్కుండా చేసి యుండవలసింది. అప్పుడింతటి మనస్తాపానికీ, ఇంత రాద్ధాంతానికీ అవకాశం ఉండేదిగాదు. పండిట్ నెహ్రూ కాంగ్రెస్‌కు ఇచ్చిన 'ఊపు' నుంచి కోలుకొని, కాంగ్రెస్ వాదులందరూ నెహ్రూ అభిమతం ప్రకారం నడుచుకో కల్గడానికి కొంత వ్యవధి కావాలి. అంతవరకూ పండిట్ నెహ్రూ ప్రయత్నం ఫలప్రదం కావడానికే ప్రతికాంగ్రెస్ వాదీ తన సర్వశక్తులా కృషిచేయాలి.

## కేసాంగులో సమితి పరిశీలకదళ ప్రవేశం

టోకియో, సెప్టెంబరు 10: సెప్టెంబరు 1 వ తేది మొదలుకొని 10 వ తేదీ వరకు ఐక్యరాజ్య విమానాలు తటస్థ ప్రాంతంమీద 139 సార్లు దాళ్లు జరిపాయని, కమ్యూనిస్టు ప్రతినిధి వర్గ నాయకుడు జనరల్ నామిల్ నిన్న అధిక్షేపణ చేయుటంవల్ల ఐక్యరాజ్యాల తాలూకు పరిశీలక దళం ఒకటి ఈ ఆరోపణకు దర్యాప్తు చేసేందుకు ఈ ఉదయం కేసాంగ్‌లో ప్రవేశించింది.

కమ్యూనిస్టులు ఇట్టి అధిక్షేపణలు చెయ్యడం ఇది 11 వ సారి. జనరల్ నామిల్ తన ప్రకటనలో, ఇట్టి ఉల్లంఘనలు ఇకముందు జరగవని హామీ ఇవ్వవలసిందిగా ఐక్యరాజ్య ప్రతినిధులను కోరాడు. నామిల్ ఈ ప్రకటనను పెకింగు రేడియో ప్రచారం చేసింది.

## ఎ. ఐ. సి. సి. సభ్యులకు నెహ్రూ ఉద్బోధ

(1 వ పేజీ తరువాయి)

పడి వచ్చారు.

ఈ జ్యోతిలో ఎవరు చేపట్టగలిగినంత అంశాన్ని వారు, కాంగ్రెసు సేవకులు, గ్రామగ్రామాలకూ దేశంలో మూలమూలలకూ కొనిపోయి, దేశాన్ని యావత్తూ జాజ్వల్యమానం చేశారు. తమకు వ్యక్తిగతంగా ఏమి ప్రమాదం వస్తుందో ఎట్టి ఇక్కట్టుల పాలు గావలసివస్తుందో అని వారు చూసుకోలేదు. ఒక వ్యక్తిగాని, ఒక సంస్థగాని లక్ష్యసాధనలో ఈవిధంగా మెమరచి పనిచేసినప్పుడు, ఆ వ్యక్తిని లేదా ఆ సంస్థను ఎవ్వరూ అడ్డలేరు. ఎవ్వరూ ఆపలేరు. అడుగడుగునా లాభనష్టాలు బేరీజు వేసుకొనే వ్యాపారతత్వం గలిగినవారువిమహాత్కార్యాన్నీ జన్మలో సాధించలేరు. ఇదివరలో కాంగ్రెసు కార్యకర్తలు మహత్కార్యాలు సాధించగలిగారంటే, ఆ నాడు వారికట్టి వ్యాపారదృష్టి లేకపోవడంవల్లనే. అయితే కాంగ్రెసు సేవకులు ఏం చెయ్యాలని మీరు అడిగేది? అప్పటి పరిస్థితులు కాదు; ఇప్పటి పరిస్థితులు వేరు. అప్పుడున్నట్లు ఇప్పుడు వుండమంటే ఎలా సాధ్యం అని మీరు నన్ను ఎదురు ప్రశ్నించవచ్చు. దానికి నా సమాధానం ఏమిటంటే పరిస్థితులమీద నెపం ఎన్నటం అర్థంలేనిమాట. ఉన్న పరిస్థితులను మార్చుకోటం లేక కొత్త పరిస్థితులను కల్పించుకోవడం మనుష్య ప్రయత్నంలో వున్న విషయం. జీవితం అంతా విధి చోదితం అనుకోవడం, జ్యోతిష్కులు సిద్ధాంతాలు చెప్పినట్లు వినటం ఇది స్వశక్తిలో నమ్మకంలేని కాపురుషులు చేయవలసినపని. ఈ దేశంలో అలాంటి మూర్ఖులు చాలామంది వున్నారు. నన్నడిగితే, ఇలాంటి అర్థం పర్థంలేని జ్యోతిష్యాన్ని అంతా కట్టగట్టి తుంగలో తొక్కాలంటాను; అసలు దేశంలో ఈ జ్యోతిష్యము చేవృత్తి లేకుండా శాసనం చెయ్యడం మంచిదేమో అనిపిస్తోంది. సెప్టెంబరు 9వ తేదీన ఇండియా పాకిస్థానులకు యుద్ధం వస్తుందని ఒక ఢిల్లీ పత్రిక జోస్యం ప్రకటించగా, అది మాసి, మూటముల్లె సర్దుకొని ఢిల్లీనుండి స్థలాంతరాలకు ఎంతోమంది పారిపోయారు. ఇటువంటి మూఢ నమ్మకాలకు ప్రజలు ఎర కాగూడదు.

ఇలాంటి మూఢ నమ్మకాల సాలీడు గూళ్లనూ పాజుట్టునూ సర్వవిధమైన కశ్మలాన్నీ ఒక్క వూపుతో ఎగరగొట్టి పారేసే పెనుగాలులను మనం లేవదీయగలుగుతాము. లేదా అన్నదే నా ప్రశ్న. లేకపోతే మనంకూడా ఆ సాలీడు గూళ్లలోనే తగులుకొని మిడుకుతూ మిడుకుతూ చూస్తూ కూర్చోవడం మీకు అభిమతమా? అని నెహ్రూ ప్రశ్నించాడు. "దీనికి ఒక్కటే సమాధానం వుంది, అన్ని విధాలైన దుష్టసిద్ధాంతాలను అసమర్థ దుర్జనులను పడదాటుల్లా మాడ్చివేసే ఝంఝూనిలాన్ని మనం ఉద్భూతం చెయ్యాలి. నా మాట నమ్మండి; ఈ విధంగా ఆలోచించి ఈ విధంగా మీరు పని చేసినట్లయితే, మళ్ళీ జనం మీచుట్టూ మూగి తీరుతారు."

ఆర్థిక కార్యక్రమం, విదేశాంగవిధానం మతి తత్వంమొదలైన విషయాలను గురించి మీరు మనస్సులో నాటికి నూరుపాళ్ళు ఖచ్చితమైన అభిప్రాయాలను ఏర్పరుచుకోవాలి. ఇందులో అణుమాత్రమైన అనుమానానికికూడా ఆస్కారం ఇవ్వరాదు.

కాంగ్రెసు తీర్మానాలకూ, కాంగ్రెసు సిద్ధాంతాలకు వ్యతిరేకించే వారిపై, ఆ వ్యతిరేకించేది ఎవరుగానీయండి ఎటువంటివారు గానీయండి, మనం యుద్ధానికి దిగాలి. యుద్ధం అంటే చేతులుకలపటం జుట్లు జుట్లు పట్టుకోవటం అని కాదు నా అర్థం. ఏదిఏమైనాసరే, వారితో మానసికంగా మనం సంఘర్షించి విజయం సాధించాలి. నిర్మలమైన మనస్సులతో ప్రస్ఫుటమైన అభిప్రాయాలకు రావాలని కాంగ్రెసు వాదులను ముఖ్యంగా నేను కోరుతున్నాను. స్వాతంత్ర్యం రావటం అన్నది ఒక విధంగా ఆకస్మిక సంఘటనే అని చెప్పవచ్చు. ఎందుకంటే కావలసిన పూర్వ సన్నాహాలన్నీ చేసుకొని దానికి ఎదురుకోలు ఇవ్వగలిగిన స్థితిలో మనం లేము. ఈ కొత్త బాధ్యతలను మనలో కొందరు కొంతవరకూ మోయగల్గినా, ఆ మోయటంలో తిక్కిన ఇతర విషయాలన్నీ మనకుకనుమరుగైపోయినాయి. దానితో అనతేపరిపాలనా బాధ్యత మనం ఎవరికోసంమీద వేసుకొన్నామో, ఆ ప్రజలనుండేదూరంకావలసిన దుర్గతి మనకు పట్టింది. ప్రజలతో సంపర్కం ఏర్పరుచుకోవటం, వారి ఆశయాలనూ, ఇంగితంగా వున్న వారి సర్వమనోభావాలనూ ప్రతిఫలింపటం అన్న ఈ విస్మృతాభ్యాసాన్ని కాంగ్రెసు మళ్ళీ అలవర్చుకోవాలి. ఇదిగనుక, చేయగల్గినట్లయితే, తిక్కినవన్నీ వాటంతటవే వచ్చేస్తాయి.

ఎన్నికలలో మనం నెగ్గుతామా నెగ్గమా అని లెక్కలు వేసుకొంటూ కూర్చోవటంకంటే, మన సిద్ధాంతాలను మన లక్ష్యాలను మనం సాధించగల్గుతున్నామా లేదా అన్నదే ప్రధానంగా పెట్టుకొని పనిచేసినట్లయితే, ఈ ఎన్నికలు ఒకటి కాదు, ఇలాంటి వంద ఎన్నికల్లో మనం అఖండవిజయం సాధించగల్గుతాం; అట్లాకాక, ఎంత సేపూ ఎన్నికలమీదనే మనస్సు పోనిచ్చినట్లయితే, కాంగ్రెసు అణగారిపోవటం తథ్యం. ఈ వ్యక్తికి వెళ్ళుందనీ, ఆ వ్యక్తికి బలముపబడి వుందనీ, అయినవాళ్ళతోను కానివాళ్ళతోను రాజీ పడినట్లయితే, కాంగ్రెసు తన లక్ష్యాన్ని సాధించలేదు. ఎన్నికలన్నవి మన అసలు పోరాటానికి సంకేత ప్రాయమైనవి. అవే మనకు పరమావధి కాదు. ఎన్నికలలో విజయంసాధించే ప్రయత్నంలో మన లక్ష్యాలను మన సిద్ధాంతాలనే వదులుకొన్నట్లయితే, ఇక ఆ విజయం వచ్చిఎంత? రాకఎంత? కాబట్టి ఎన్నికలను అభ్యర్థులను నిర్ణయించేటప్పుడు ఈ దృష్టితోనేనిర్ణయించాలి.

ఇదివరలో కాంగ్రెసులో అనేక చీలికలు, అనేక వర్గాలు వున్నమాట వాస్తవం. ఇందుకు మనమంతాకూడా సమానంగా బాధ్యులం. కాబట్టి ఈ పాత మనస్తత్వాన్ని మనం అంతా వదిలించుకొని ఇకనుంచీ ఒకటిగా పని చేయడానికి ఉపక్రమించాలి. ఫలానా వ్యక్తి ఫలానావర్గానికి చెందినవాడనీ, అందుచేత అతణ్ణి నమ్మరాదనీ కొంతమంది నాకు చెబుతూ వుండడం కద్దు. ఎవరో కొద్దిమంది వినహాయింపులో తప్ప, తక్కినవారు ఎవరే వర్గానికి చెందిందీ నాకు తెలియదు; తెలుసుకోవాలని గూడా నాకు లేదు. నాకు ఎదుటివాడిలో కావలసిందల్లా శక్తిసామర్థ్యాలు ఋజుత్వమూ, కార్యదీక్ష. ఇతర విషయాలు నాకు అనవసరం; ఎందువల్లనంటే, యెంతటి బలీయమైన కక్షలో నుంచి అయినా సరే ఎదుటివాణ్ణి నావైపుకు ఆకర్షించుకోగల్గిన శక్తి నా దగ్గర వుందని నా నమ్మకం.

అభ్యర్థులను నిర్ణయించడంలో ఫలానా వ్యక్తి కాంగ్రెసులో వున్నాడా లేదా అన్నది ప్రధానం కాకూడదు; తగినవారు దొరికినట్లయితే బైటివారి నుంచిగూడా ఎంచుకోవచ్చు. అభ్యర్థులకు వుండవలసిన మొదటి అర్హత ఋజుత్వం శక్తిసామర్థ్యాలు. ఇంతకుమించి వేరే అర్హత అంటూ లేదు. ఇదే ప్రథమార్హత, పరమార్హతాను అని పండిట్ నెహ్రూ నొక్కి చెప్పారు. "ఒక అభ్యర్థికంటే ఇంకో అభ్యర్థికి తక్కువ ప్రాబల్యం వున్నా, ఆ తక్కువ ప్రాబల్యం వున్న అభ్యర్థి ఋజుత్వం స్వతశ్శక్తి కలవాడైతే అతణ్ణే ఎన్నికలలో నిలబెట్టాలి. ఇల్లా నిలబెట్టటంవల్ల రెండు మూడుసీట్లు కాదు పదిసీట్లు పోయాయి అనుకోండి, అయినా పరవాలేదు, అంతకు పదింతల లాభం ఇతరత్రా మనకు కలుగుతుంది. కాంగ్రెసు సేవకులు స్వార్థంకోసం ఆత్మను బలి పెట్టరనే విశ్వాసం ప్రజలలో కలిగితే, పోయిన సీట్లకంటె 10 రెట్లు ఎక్కువసీట్లు దరిమిలాను మనకు లభిస్తాయి.

టాండన్ జీ చెప్పినట్లు ఆ భ్యర్థిత్వంకోసం దరఖాస్తులు పెట్టుకొన్నవారిలోంచి కంటే పెట్టుకోని వారిలోంచి అభ్యర్థులను ఎంచుకోవటం మంచిది." ఈ మాటమీద ఒక సభ్యుడు అభ్యర్థిత్వంకోసం డబ్బిచ్చిన వారిగతి ఏమికావాలి అని ప్రశ్నించగా, "మీ డబ్బు కాంగ్రెసుకు అక్కరకు వస్తుంది. ఆ విషయం గురించి మీరేమీ ఆదుర్దా పడక్కర్లేదు. కాని అభ్యర్థులుగా మిమ్మల్ని నిలబెట్టటం మాత్రం కలలో మాట" అని నెహ్రూ జవాబిచ్చేసరికి సభ్యులంతా పగలబడి నవ్వారు. అనంతరం అక్టోబరు 18, 19 వ తేదీలలో కాంగ్రెసు వార్షిక సమావేశం జరపాలన్న తీర్మానం ఓటింగుకు పెట్టబడి ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

## జమ్ముడ్వారులో సాయుధదోపిడి

### 3 లక్షలధనం అపహరణ

జెమ్షెడ్పూరు, సెప్టెంబరు 10: ఈ వేళ యిక్కడ టిన్ ప్లేట్ కంపెనీ తాలూకు టౌన్‌ఆఫీసు గేటువద్ద నలుగురు దొంగలు కాపువేసి, గోల్మూరిలోని హెడ్‌ఆఫీసునుంచి కార్మికులకు జీతాలుఇచ్చే నిమిత్తం ఒకస్టేషన్ వాగన్‌లో డబ్బుతీసుకొని వస్తుండగా వాగన్‌మీదపడి ఎడాపెడా తుపాకులు కాల్చి దానిలోవున్న 3 లక్ష ల 18 వేల రూ. ఎత్తుకుపోయారు.

దొంగలు ముఖాలు కనపడకుండా ముసుగులు వేసుకొన్నారు. రోడ్డు పక్కన పోతున్న జనాన్ని చెదరగొట్టడానికి బాష్పవాయువు ప్రయోగించి దొంగలు చూస్తూ చూస్తూ వుండగా, కారులో తుర్రుమన్నారు. తుపాకి కాల్పులవల్ల వాగన్‌లోని కంపెనీ తాలూకు సాయుధభటుల్లో ఒకడు మరణించాడు; మరొకడు తీవ్రంగా గాయపడ్డాడు. ఇంతవరకు దొంగల ఆచూకీ చిక్కలేదు; వెదకగా వెదకగా కొంతసేపటికి వాళ్లు ఎక్కిపోయిన కారుమాత్రం దొరికింది; సంఘర్షణ జరిగిన స్థలానికి మైలు దూరంలో దొంగలు దానిని వదిలివేసి పారిపోయారు.

## మద్రాసు టెన్నిస్‌లీగ్

మద్రాసు టెన్నిస్ లీగ్ పందు ఆదివారం సాయంకాలం ఆడయూర్ టెన్నిస్ క్లబ్బు, కార్బికన్ క్లబ్బును 4—0 ఆటలతో ఓడించింది.

## హైదరాబాదు (ఉస్మాన్‌గంజ్) మార్కెటు ధరలు

(వర్తయిడాదు గుప్తా ఇచ్చయ్య గారి పంపకోళం)

హైదరాబాదు, సెప్టెంబరు 10: బంగారం తులం1కి 130-8-0; వెండి 100 కు 214-0-0. పల్లీ ఒకటికి కనుష్ఠ 50-75 పెసలు 40.44-8-0 కందులు 44-46 మినుములు 88 బంకలు 53 ఉలవలు 42-48 కందిపప్పు పెద్దది 67-68 కందిపప్పు చిన్నది 63 పెసరపప్పు 72-78 మినపపప్పు 110-112 పేడశనగపప్పు 95 100 ఆముదాలు 84 87 బింకలం.30-45 మిర్చి 101-160 కుసుములు 50 52 ధనియాలు 16 శెల మంగు 15-27 బెల్లం 11-12 ఒల్లిగల్ల 18-41

## నగరానికి కృపలానిరాక

### కాంగ్రెస్ అధ్యక్షుడు మారుట గూర్చి అభిప్రాయం

మదరాసు, సెప్టెంబరు 10: ప్రజాపార్టీ నాయకుడు ఆచార్య కృపలానిగారు యీవాళ ఢిల్లీనుండి విమానంలో మదరాసు వచ్చారు. వారిని పత్రికా ప్రతినిధులు విమానాశ్రయంలో కలుసుకొని మాటాడగా యీ క్రింది భావాలను వెలిబుచ్చారు. నాకు యేవ్యక్తితోగాని పోట్లాటలేదు. భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించినాక కాంగ్రెసు సంస్థనుంచి ప్రభుత్వానికి ప్రాధాన్యం మారింది. కాంగ్రెస్ అధ్యక్షుడు నెహ్రూ అయినప్పటికీ కూడా ఒకగజం గుడ్డగాని ఒకగింజ ధాన్యంగాని యిప్పుడు లభిస్తున్న దానికంటె ఎక్కువ లభించదు. అందుచేత ప్రభుత్వ దృక్పథం మారాలిగాని కాంగ్రెస్ కాదు. అయినా సంస్థలో కూడా సంస్కరణ రావడం అవసరమే అన్నారు.

## జపాన్‌తో శత్రుత్వం పరిసమాప్తి

(1 వ పేజీ తరువాయి)

అమలులోనికి రాగలదో ఆటుపిమ్మట వెంటనే భారతదేశానికి జపానుకుగల శత్రుత్వం సమాప్తం కావలెనని భారత ప్రభుత్వం కోరుతోంది.

యుద్ధానికి పూర్వం జపానుకు భారతదేశానికి ఎటువంటి సఖ్యత ఉండేదో అటువంటి స్నేహసద్భావముతే తిరిగి ఏర్పడగల నిమిత్తము ఉభయరాజ్యాలకు మధ్య ఒక సంధిపత్రమును ప్రత్యేకంగా సాధ్యమైనంత త్వరలో వ్రాసికోవలెనని ఇండియా ప్రభుత్వం కోరుతోంది. శాన్‌ఫ్రాంసిస్కో సభయందు వ్రాసికొబడిన సంధి పత్రమందు ఆయా మిత్రరాజ్యాల విషయములో ఏ హక్కులు ఏ ప్రత్యేక స్వాతంత్ర్య సౌకర్యములు కలుగజేయబడెనో వాటిని అమలుజరుపుట కెట్టి హక్కులు కల్పింపబడెనో అటువంటిహక్కు అధికారములను భారత దేశీయులకున్నూ జపాను ప్రజలకున్నూ కలుగజేయగల మరతు నిబంధనలు భారత ప్రభుత్వం జపానుతో వ్రాసికొనేటటువంటి ప్రత్యేకసంధి పత్రములోకూడా చేర్పబడును. ప్రస్తుతపు సంధిపత్రముమీద సంతకంచేసే నటువంటి రాజ్యాలచే (జపాను సహా) యిది ఖాయపరచబడవలెను.

## గుంటూరులో 16 వ ఆంధ్రప్రముఖుల సభ

(1 వ పేజీ తరువాయి)

యీ సాయంత్రం విమానంలో మదరాసుకు తిరిగి వచ్చారు.

మదరాసు రాష్ట్రం కేంద్ర ప్రభుత్వాన్ని కోరిన ఆహార కోటాలో బియ్యము 2 లక్షల టన్నులకంటె ఎక్కువ యివ్వటానికి సాధ్యపడదని కేంద్రప్రభుత్వం నిర్కర్షగా తెలిపినదని వారు పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ తెలిపారు. మాసవారిగా కేంద్రప్రభుత్వం వాగ్దానం చేసిన మొత్తమునందు బాకీయుండే ధాన్యము పాకిస్థాను నుండి పప్లయిలు అందగనే భర్తీచేయుననట్లు కేంద్రప్రభుత్వం తెలిపినదనికూడా వారు చెప్పారు.

స్వామి సీతారామ్‌గారి ప్రాయోపవేశం విషయమై ప్రస్తావించగా తాను చేయగల్గినదంతా చేశానని అన్నారు.

శ్రీ యం. పల్లంరాజు శ్రీ పి. సి. సుబ్బారెడ్డిగార్లు కూడా ఏ. ఐ. సి. లో హాజరై యీవాళ విమానంలో మదరాసుకు తిరిగివచ్చారు. శ్రీ సుబ్బారెడ్డిగారు పత్రికలవారితో మాట్లాడుతూ భారత ప్రధాని నెహ్రూగారు నిన్న యిష్టాగోష్టిగా ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు ఎ. ఐ. సి. సి. సభ్యులతో మాట్లాడారని ఆంధ్రసభ్యులు ఆంధ్రరాష్ట్ర సమస్య స్వామీజీ ప్రాయోపవేశం విషయాలు గూర్చి అభిప్రాయాలను ప్రధానికి తెలియపరచారని చెప్పారు. మదరాసు వదులుకుంటే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సాధ్యపడవచ్చనే అభిప్రాయం ప్రధాని సూచనగా తెలిపారని శ్రీ సుబ్బారెడ్డిగారు అన్నారు.

ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు, శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, మదరాసు ఆర్థికమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు రేపు ప్రధానితో ఆంధ్రరాష్ట్ర సమస్య విషయమై సంప్రతిస్తారని తెలుపబడుతోంది.

## రేడియో

### సెప్టెంబరు 12 బుధవారం

విజయవాడ

ఉ॥ తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసువలె 8-0 ఆంగ్లమున వా॥
మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు సులభగణితము మానసములు వి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి ఆహారపు విలువలు మాంసకృత్తులు 1-0 మద్రాసు (బి) వలె 1-30 మద్రాసు (ఎ) వలె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 2-0 మద్రాసు (బి) వలె 2-15 ఉన్నత పాఠశాలావిద్యార్థులకు వాయువులు ఫ్లోరిన్ ప్రసంగం కె. రామచంద్రశాస్త్రి హిందీపాఠము 4-0 ప్రాథమిక పాఠశాలావిద్యార్థులకు నిర్మాణములో విచిత్రము. ఎంపైర్ స్టేటు బిల్డింగు ప్రసంగం బడిలో నాటకాలు పరమానందయ్య శిష్యులు సంగీత పాఠము.
సా॥ 5 30 మేదూరి సత్యజ్ఞాన ప్రసూనాంబ వీణ 5-50 శష్ఠి సుబ్రహ్మణ్యశాస్త్రి 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానికప్రకటనలు వాతావరణము 6-20 విజయవాడ రేడియోఆర్కెస్ట్రా 6-30 గ్రామస్థుల కార్యక్రమం గ్రామసహకార రుణసంఘాలు కో ఆపరేటివ్ డిపార్టుమెంటు వారి ప్రసంగం భజనపదగేయము విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7-0 తె॥ వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం పురాణకాలక్షేపం శ. మృత్యుంజయమూర్తి 7-30 సంగీతశిక్షణ 7-45 మద్రాసు (బి) వలె 8 మేదూరి సత్యజ్ఞాన ప్రసూనాంబ వీణ 8-30 శష్ఠి సుబ్రహ్మణ్యశాస్త్రి 9-0 ఆంగ్లమున 9-15 శ్రోతలు కోరినరికార్డులు 9-30 ముగింపు

మద్రాసు (ఎ)

ఉ॥ 7-0 స్వాగతం 7-30 ఎ. సుందరం అయ్యర్ వీణ 8-0 ఆంగ్లమున వా॥.
మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు తమిళమున 1-0 మహిళామండలి తమిళమున 1-30 గీతమంజరి (రి) 1-40 హిందీలో వా॥ 1-50 ఫిలిం సంగీతం (రి) 2-10(బి) వలె 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు తమిళమున 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు తమిళమున 4.30 పాశ్చాత్య సంగీతం (రి)
సా॥ 5-30 ఎస్. బి దినకరరావు 6-0 ఆంగ్లమునవా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 ఎ. వి. సుందరవల్లి 7-0 గీతమంజరి (రి) రత్నకుమార్, ప్రసన్న సంగీత్ ప్యారీ మండలి 7.30 వేణువు నిలయవిద్వాంసుడు 7-45 తమిళమున ప్రసంగం 8 ఎన్. పి. హంస దమయంతి 8-30 టి. ఆర్. బాలసుబ్రహ్మణ్యం 9-0 ఆంగ్లమున వా॥ 9-15 ఆంగ్లమున ప్రసంగం. బెజవాడ గోపాలరెడ్డి 9.30 టి. పెరుమాళ్‌నాయుడు క్లారినెట్ 10 (బి) వలె 10-30 ముగింపు.

మద్రాసు (బి)

ఉ॥ 7-0 తెలుగున వా॥ 7-15 ఎస్. వి. సుబ్బయ్యభాగవతర్ (రి) 7-30 (ఎ) వలె
మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం. 12.30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు సులభగణితము మానసములు ప్రసంగం వి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి ఆహారపు విలువలు మాంసకృత్తులు ప్రసంగం 1-0 గీతమాలిక (రి) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 ఫిలిం సంగీతం (రి) 1.50 తెలుగునవా॥ 2-0 గోటువాద్యము నిలయ విద్వాంసుడు 2-15 ఉన్నతపాఠశాల విద్యార్థులకు వాయువులు ఫ్లోరిన్ ప్రసంగం కె. రామచంద్రశాస్త్రి హిందీపాఠము. 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు నిర్మాణములో విచిత్రము ఎంపైర్ స్టేటు బిల్డింగ్ ప్రసంగం బడిలో నాటకాలు పరమానందయ్య శిష్యులు సంగీతపాఠము.
సా॥ 5-30 (ఎ) వలె 6-20 గానమంజరి (రి) ఈరోడ్ విశ్వనాథయ్యర్ ఎస్. కె. దొరైకన్ను 6.30 గ్రామస్థుల కార్యక్రమం గ్రామసహకార రుణసంఘాలు కో ఆపరేటివ్ డిపార్టుమెంటువారి ప్రసంగం. భజనపదగేయము విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7-0 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం పురాణ కాలక్షేపం శ. మృత్యుంజయమూర్తి 7-30 (ఎ) వలె 7-45 మదరాసైనిమున ఆరోగ్యప్రచారము ప్రసంగం. డి. సుబ్బారావు శివమార్పు ఆముసాంఘికనాటకము రచనఎస్. వి. భుజంగరాయశర్మ 8-30 (ఎ) వలె 9-30 భారతదివ్య వృతి తిర్పనములు తిరువనుండి 10-0 శాస్త్రీయ సంగీతం (రి) కుంభకోణం వీరాదరులు ఎస్ వి. పార్థసారథి ఎస్. జి. కిట్టప్ప కె. రామనారాయణఅయ్యర్ ఎ. జి. సుబ్రహ్మణ్యం 10-30 ముగింపు.

హైద్రాబాద్

ఉ॥ 7-0 తెలుగునవా॥ 7-15 తెలుగు హిందీలలో నేటి కార్యక్రమసమీక్ష 7-20 శాస్త్రీయ సంగీతం (రి) 7-50 కవిత్ పఠిమా గీత్ 8 ఆంగ్లమున వా॥ 8-15 మహబూబ్‌బక్ష్ 8-30 కవితపఠిమా మజిల్‌గీర్ 8-45 మహబూబ్‌బక్ష్
మ॥ 12-30 శాస్త్రీయ సంగీతం (రి) 1-0 గీతమంజరి (రి) 1.30 ఆంగ్లమున వా॥ 1.40 ఎస్. వి. వసంతకోకిలం (రి) 1-50 తెలుగునవా॥
సా॥ 5-30 హిందీలో పిల్లల కార్యక్రమం 6-0 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6.20 కవితపఠిమా మజిల్ 6-30 దాన్‌సాహెబ్ దిక్షిత్ 6-45 గ్రామసీమ గజేంద్రమోక్షము పురాణము వాద్యసమ్మేళనం (రి) 7-0 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ అంతర్జాతీయ వ్యాపారము ప్రసంగం బల్లరిబు పాపయ్య కథరచన ఎం. గోఖలే విశేషాలు మార్కెట్ ధరలు వాతావరణము. 8-15 ఆంగ్లమున ప్రసంగం 8.30 ఆంగ్లమున కార్యక్రమం 8-[illegible] సంగీతమ(రి) 8-45 నా ఉత్తమకథ [illegible] కథానిక రచన 'మిద్ది' 9-0 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 హిందీనాటిక 10.15 ముగింపు

## కార్పొరేషన్ బ్యాంకు

మద్రాసు, సెప్టెంబరు 10: రేపు సాయంకాలం అయిదున్నరకు గంటలకు రేడియోరోడ్డు చివరభాగాన వీదిలో కార్పొరేషన్ బ్యాండువాద్య సమ్మేళనం ఉంటుంది.

## బొంబై వెండి బంగారు మార్కెటు

బొంబై, సెప్టెం 10: నేటిమధ్యాహ్నం 2-0 గంటలకు బొంబై వెండి-బంగారు మార్కెటుధరలు: వెండి (100 తు) రు 188-0-0, బంగారం (తు 1కి) రు 112-0-0, సావరిన్ 1కి రు 77-8-0.

